ఓం.

శ్రీ రమణార్పణమస్తు.

# నైవేద్యము

పొణకా కనకమ్మ

ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ




ప్రకాశకులు:

శ్రీ నిరంజనానందస్వామి

సర్వాధికారి

శ్రీ రమణాశ్రమము

తిరువణ్ణామలై.

అంకితములయ్యె నీ హృదయమ్ము శేష
ప్రభుని పావన శ్రీపాద పద్మయుగళి
స్వామి బ్రహ్మోత్సవములఁ సాష్టాంగమె
ఆత్మ నైవేద్యమిది కూర్మి నారగింపు.



భగవాన్ శ్రీ రమణమహర్షులు

ఓం

శ్రీ రమణాయనమః

# నైవేద్యము

శ్రీ పరాత్పరునకు శివకళాధరునకు
స్వాత్మపదవ్యులేలు సద్గురునకు
జయముసర్వదా ప్రశాంతమూర్తికినీకు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

మంగళమ్ము, అమృతమయరూపునకునీకు
మంగళమ్ము భువనమంగళునకు
మంగళమ్ములెపుడు భగవంతునకునీకు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ఏమిస్ఫూజ నీమహేశ్వరరూపమ్ము
నిరతమిత్తు దర్శనీయముగను
విభుతఁగొల్వఁదీర్చి విశ్వసమ్రాట్టువై
సచ్చిదాత్మకిరణ: జ్ఞానరమణ!

ఆకసమ్మె ఛత్ర మవనియే పీఠమ్ము
ఉదధియే కమండ లూదకమ్ము
దేవ: వాయువూర్పు, తేజస్సెరూపమ్ము
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

శాంతిసౌక వీవె, సచ్చిదానంద వా
రాశివీవె, యందుప్రభుఁడవీవె,
కర్ణధారివీవె, కైమోడ్పు లివె ప్రభూ!
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

నిరవధికము లైన నీపదమ్ములుసేర
మరవధికములెల్ల తొలఁగిపోవు
అనవధికశరణ్య మగుఁగదా నీప్రాపు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

హృదయమందునిలువ నింతచక్కనిదైవ
మితరదృష్టులేల నెసఁగుబయల
లోనిచూపు, రూపు, లోఁగొనుగా మమ్ము
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

కనులుమూయఁదెఱవఁ గానుపింతువునీవె
గాఢనిష్ఠలేల? కనులుమూసి,
అడుగుఁదమ్ములకు జోహా ర్లిప్పుకొందుము
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ప్రణుతిసేయ శాస్త్రపరిభాషలేటికి?
కావ్యపాండితీ ప్రకర్షలేల!
శరణ మన్న నుడువు చాలదాయొక్కటి
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

శరణ మెప్పుడు రమణచరణమ్ములే యన్న
పరమసులభమైన పదము లివ్వి
ఇంతమాత్రమునకె ఎంతెంతొ వాకొంద్రు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

నినుఁబ్రపత్తిచేసి నిష్ఠ నిల్కఁడనొంద
ఎంతొకష్ట మనితలంతు మీశ!
నిలుతునీపై పరమసులభంబుగా మది
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

బయలిచూపు మాప పలుపాటులేటికి?
లోనిచూపు కాస లూననేల?
ఎందు లోన, బయల, నీవయై వెలుగంగ
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

కనులనీరు లోడికలుగట్ట నేటికి?
చెవులుచిల్లులువడ చెప్పనేమి?
మాట, చూపు, నీదుమదిఁ జొరఁబడకున్న
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

కొండపైనినీవు గూరుచుంటివయేమి?
పిలిచిపిలిచి విసివి, వేసరంగ
కొండదిగితి వెపుడో గురుకృప మముఁబ్రోవ
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

కరుణ సేయుమనుట కాఠిన్యమాయేమి?
స్వామినైజమే ప్రసాదగుణము
కోరనేలవేర గోరకే దనియింతు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

నిన్నుఁ జూచి మ్రొక్క నిఖిలపాపచయమ్ము
తానె మాయు దీపదర్శనమున
తిమిరసంచయ మ్మదృశ్యమౌ చందాన
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

మనసునణఁతుమన్న మనసు నీవేయైన
మనసు నోర్చుచేల మాకుఁగల్గు
మన సదేమొ, మేముమరియేమొ! మాకేల?
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

కొండగుహలఁ జూడకొని వేసరిలనేల?
హృదయగుహను నీవె యెపుడు వెలుఁగ!
ఎదుటనున్నవాని నెఱుఁగమి యుండునే
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

మానవులకు బుద్ధి మహిమ పెమ్పుగనుంట
వెదకుకొనుఁడు ముక్త్తివిత మటనెదొ?
జంతుగణముఁగూర్మి సంతరింతువునీవె
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

నాఁడురామభద్రుఁ డోడక వెనుదువ్వ
యుగయుగాలముద్రబొందె నుడత
నేఁడుచిహ్నాలేమొ? నిమిరిమేయింతువు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ఏమినోముఫలమొ' ఎన్నాళ్ళతపసులో
ఆలమంద, విహాగపాళి, ఘూత
జాల మెల్లఁజేరు స్వామిసన్నిధియందు.
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

గోవు. లక్ష్మి. మావిగున్న పూజలమించి
కామగవియు కల్పకద్రుమమ్ము
లేమిహెమ్మునోచె? నిట్టట్టుగుటెగాక
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

శివునిమోచి ముక్తిచెందును పశువు మా
ధవునిమోచి ముక్తిఁ దనరు పక్షి
శ్రమము, సేవలేక రమణుసన్నిధిముక్తి
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

వేయికనుల దేవవిభునివైభవమేల?
ఫాలనేత్రుఁజూడఁజాలఁడేని!
అనుభవమ్ముగాని దంతంతగానేమి?
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

నిన్నుశరణుగోరి, నీమదిలోఁజేరి
నిలిచియున్నవారిఁ దెలియఁగలమె?
బయలనున్నవారి పరికింపఁగాలేము
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

గుణములన్ని యెన్నుకొని చింతపడనేల?
ఏగుణమ్ములేని యింగితమ్ము
నీగుణమ్మ టనెడి నెఱిబుద్ధి చాలదా!
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ఎన్నొపృచ్ఛసేతు రేమియోపేర్కొందు
ఒకటి యేని యడుగ నొల్లమమతి,
శంకరాదొః తెలివిచాలదొ ప్రశ్నింపః
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ప్రణమిలంగనొక్క పలుకైనవెలిరాదు
ఏమొముగ్ధమై లయించిపోవు
తను మనమ్ము లొక్కఁడాదిగా నొందొంట
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

కృష్ణ వేణురవముకే గాదు నునుమేని
కాంతిపర్వ భూతగణముసోలు
నీదు పేరువిన్న నే వివశమ్మెల్ల
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

వేదపఠనవేళ వినువీథి విహరించు
విధముదోఁచు నీదు విధముఁగనిన
ఎన్నివిధుల నోచుకొన్నవారమొ మేము
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ఆశ పుట్టనీని యవతారమూర్తివి
ఆశదీర దని నిరాశయేల?
నింతిశయమునిచ్చు నిష్కాముఁడవు ఛీ!
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ

మనసుకొద్ది నిలిపి మరిసేవ లీయక
జతన మేలనయ్య! స్వామిఁగొలువ?
కొలిచి, ఎంచి చేసుకొందు మాపూజలు?
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

అమృతగంగయును, సుధాకరుండునుఁ దమ
తావువీడి మమ్ముఁదనుప నీదు
కవనవాక్కునందు కడకంటనిలిచిరో!
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

విసమునుమిసి, మధువు మెసవితివోస్వామి!
హాలహాలమె యమృత· మయ్యెనో మరి!
కాలగళుఁడ వమృత కంఠుండవైతివి
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

నాఁటి మౌనదక్షిణామూర్తిఁ జూపింప
నిగమపఠనవేళ నీవుమూర్తి
నిగమశాసనుఁడవు నిగమాంతనేతవు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

నిలిచినిన్నుఁ జూచి నిజువెల్లవివశమై
యణువు నణువుఁ బొగడ నాళ పాదము
వాక్కు లేల మౌనవాటికఁ జేరునో?
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

మౌనధారివగుచు మాకెవ్యాఖ్యానింతు
మౌనముద్రవీడి మాకెచెపుదు
మాటలాడ, మాటమానిన మాకెగా!
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

నీవిపర్గమూర్తి నెమ్మదిఁదిలకించి
చిన్మయాత్మసుఖముచే రమింప,
తలఁపులేల? మౌనదశలేల? వేరేల?
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

చూచినట్లైయుండు చూడఁబో వెవ్వరి
చూడనట్లైయుండు చూతువన్ని
చూపులోనిగుట్టు చూపెడివేల్పువు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

పరమఋషులకైన బ్రహ్మర్షులకునైన
మునులకైన తత్వధనులకైన
పరమదుర్లభములు ప్రభునిపాదములంద
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ప్రాణ మనెడిపూవు భక్తి చేపట్టి నీ
యడుగుఁ దమ్ములను సమర్పసేయ
తపన పొందునాత్మ తనియును పరివేర!
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

చెప్పినట్లువినదు, చేత మంత దృఢ
త్వమున హృదయమందిరమున నిలిచి
నిన్నెతొంగిచూచు నిల్వనేఁని తమి
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ప్రక్కచూపులేక చక్కఁగా నినుఁ జూచ
పొసఁగు నిష్ఠ మాకు; నొసటఁగన్ను
నిలిపినావొ గాక నీకేలనడికన్ను?
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

కలియుగమ్మ యిద్ది? కాదు; కృత, త్రేత,
ద్వాపరముల మించి తనరుయుగము
కలి తరించిపోయెఁగద నీవు ప్రభవింప,
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ

ఉర్వి చదల నుండి, ఉదధులన్నియు దాఁటి
భుక్తిచింతవీడి ముక్తివేడి
వచ్చిపోదురెపుడు పాశ్చాత్యభక్తులు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

గాలిలేని దీపకళిక చందమ్మున
అలలు, సుడులులేని యబ్ధివోల్కి
సర్వకాలములను నిర్వికారుఁడవీవు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ఒక్కమారునీవు ఒరగంటఁజూచుచూ
త్రమ్ముచేత కర్తృధాత్రి మాకు
చేయఁదగిన కృత్యమేయది మిగులదు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

కదలి గ్రోలుకంటె కనకాద్రిపెకలించు
కంటె, చిత్తనియతి కఠినమండ్రు,
నీ యనంతకరుణ కేయ దసాధ్యమ్ము?
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

జ్ఞానమునకుమించి సౌఖ్యమ్ము; ప్రేమకు
మించిపూవు, ముక్తిమించిపదము;
ప్రభుని మించిలేదు ప్రత్యక్షదైవమ్ము
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

స్వర్ణశైల రజత శైలమ్ములనునిల్పి
విచ్చమెత్తి తేమి వేడ్క నీకు?
త్యాగతత్త్వమును నుదాహృతిచేయనో?
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ఆత్మధనునినిన్ను అసయ మెవ్వేళను
గురుతువిడఁడు బుద్ధి కోవిదుండు,
ప్రొద్దుచూచి కోడిపుంజుకూయునె విభూ?
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ఎట్లు వచ్చె బ్రతుకు; ఎటువోవు, నేమగు?
దానిఁ దెలియువాఁడు తత్త్వవిదుఁడు
నిన్నులోఁతుచూడ నన్నియుఁదెల్లమౌ
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

సృష్టి కెదురుసృష్టి చేయనేరుతు మంచు
తలఁతురెంత వెఱ్ఱితనము నరులు
దైవసృష్టిముందు తామెంత? తెలివెంత?
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

యంత్రతంత్రశక్తు లత్యంతమగుఁగాక
మంత్రశక్తి యొకటి మాకుఁగలదు?
ప్రణవనాద మదియె పరసీమ లఁగిలించు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

అల లిణాంగస్నాన మాచరించెదమన్న
కరణిఁదోఁచు భక్త గణము మ్రొక్క
కొనఁగ్గ తెరపి చూమకొని మ్రొక్కెదమటన్న!
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

మానవాళియెల్ల దీనదయా సము
ద్రుని మహాత్ముఁ జేరుకొనును విన్ను
వానచినుకు లెల్ల వార్ధిఁజేరెడునట్లు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

భక్తిఁబ్రణమిలంగ భగవానునకు నీకు
బ్రహ్మలిపిని తుడిచి పాఱవైచి
జ్ఞానమోక్షములఁ బ్రసాదింతు వొక్కంత
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

కొండకోనలందు పండు, నీరమునీకు
తక్కువయ్యా! మమ్ముఁ దనియఁజేయు
నిండుకరుణ నిండు నెలకొంటివే గాక:
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ఆలమందలోన ననురాగమున వేగఁ
జేరఁదీయుగోవు తీరుగాఁగ
మహితమైననీదు మధురవాత్సల్యమ్ము
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

తీయనగు మిఠాయి తీపి శర్కరదియే
గాని పిండిగుణము కానియట్లు
మాటమాటనున్న మాధుర్యమదినీది;
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

వస్తు వుండకున్న వలదునీడ; య
ట్లీవులేకయున్న నేములేము
జ్యోతిలేక యెందు చొప్పడునావెల్గు?
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

నవనిధానములును, నవరత్నములునెందు,
వలచుచుండ, వీసపాలులేని
పత్రపుష్పములును, ఫలజలమ్ములుఁగొందు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

కొండలన్ని మణుల కొండలు; బంగారు
షేపు తెల్ల నిండి పాలునిండు,
బూది, గోచిపాత పుట్టుపేదవు నీవు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

నీకు పెద్దవాఁడు నీతమ్ముఁడై గొల్చె,
బ్రహ్మనిష్ఠ పూని రామవిభుఁడు
నీకు శిష్యుఁడయ్యె నీచుట్టరిక మేమి?
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

పరమమైన రామచరిత దేశికుఁడౌట
చెప్పఁడప్పు డా వసిష్ఠమౌని
పటువుదీటి కావ్యకంఠుఁడై పాడెనో?
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

జలములోని పూర్ణకలశమ్మునకు బహి
రంతరముల నీర మమరునట్లు
ఆత్మరూపివీవ, యంతర్బహిస్సుల
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

వివిధపుష్పములను విలసిల్లుమకరంద
మొకటియైనరీతి సకలభక్త
పద్మములనుగల్గు పరమాత్మమధు వీవు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

మనసు నదిమి బ్రహ్మమయులై సదానంద
పరతనిల్చు బుద్ధి పరుల కెల్ల
నీవె గోచరింతు నీ కన్యమే లేదు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ఇంట దివ్వెవెలుఁగ నిరుగిండ్ల కగ్గికై
పోవనేల? జ్ఞానమూర్తినిన్ను
కనులముందు నిల్పుకొని తపింపఁగనేల?
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ఎండఁగ్రాఁగకున్న నెట్లుశీతల తరు
చ్ఛాయవలనఁగల్గు హాయితెలియు,
అట్లెనీదుపజ్జ స్వాత్మసౌఖ్యమ్మును
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

మధురశర్వరులను, మంగళజ్యోత్స్నల,
శారదాభ్రములను, శైవలినుల
ఆత్మచంద్రుఁగొల్తు మారాధనల నిన్ను
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

మౌన మీవు పూన మౌనవేద మ్మయ్యె
తర్కకారులకు మూఁగతనముఅదియె,
మాటపీడనేమి? మనసుపీడుటగాని
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ధ్యాన మాత్మనిల్వ మౌనసమాఖ్యమౌ,
వెలిని గానమై కవిత్వ మగును,
మనసు లోననిల్వ మాట బయల్పడు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

తళుకుచూపు కొనల తొలఁకాడశాంతులు
కులుకు చిన్నగవులు కొల్లలాడ
ముక్తిభూములంచు మూర్తివై విహరింతు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

నీదు దివ్యగీతి నిరయనిశీథిని
విజనవాటి నాలపించుకొందు
మెటుల విందు స్వామి త్రుటిలోనఁగన్పింతు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

అంతరంగగుహ చిదగ్నితేజమునిల్పి
ఉదయసంధ్య పొగలనూఁదులీల
నాథుబింబమునను నగరాజమొప్పారు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

వెండిముసుఁగుఁగప్పు వింతయందమ్ములై
మలయుకొండమీఁది మంచుతెరలు
పూర్ణశివవిభూతి పూనినీ వున్నట్లు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

అణువు నణువునిండి యాత్మతేజస్సులు
వెలికి వెడలి వాహినులుగఁబారి
భూనభోంతరములు పొంగి పూర్ణమ్ములౌ
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

పలుకు పలుకున నొక భాష్యమంతర్గర్భి
తమ్ము పొంది పరమ తత్త్వపథము
నంతనంతఁ జూపు హస్తామలకముగా
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ఇంతసృష్టి ఎట్టు లిమిడెను నీలోన?
ఎంతనేర్పరివి మహేశ! నీవు
ఎఱుఁగనట్టులుందు విదియెల్ల నాడింతు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

స్వామి తావకీన సాకార మయ్యదే
తేజరిల్లు ప్రకృతి దృశ్యనుగుచు
దానిమించుపరమె నీ నిరాకారము
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

చిన్ని నవ్వులో నశేష బ్రహ్మాండ పం
క్తులను నాట్యమాడు, కోటికళలు
కదిసి చేరి భక్తిఁ గైవారములుసేయు,
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

జీవితస్రవంతిదేవ! నీకృపయను
తెప్పనూఁతఁగొనుచు తేలిపోదు
మంతులేని యక్షరానంద పథముల
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

చిత్తలయముఁజేసి, చిద్వీణ సారించి
ప్రకృతి కేలుమోచ్చి ప్రణవరవము
రేయిఁబవలు నొక్క రీతి నాలాపించు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ

స్వామి సూక్తిసుధలు స్వానంద పీయూష
వార్ధులై మహా పరార్థనిధుల
దాఁచిపెట్టు గుప్తధనము లెన్నోలోన
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ఎంతచిత్ర మైన దీక్ష! నీనియమమ్ము
అనువుపీపె! మరి మహత్త్వ మీవె!
లక్ష్యమేదిమాకు లక్షణ మ్మది నీకు;
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

౨౨

ఎఱుఁగరాదు నీదు పరమేశ్వరత్వమ్ము
తెలియరాదు నీ యతీతదృక్కు
కానరాదు నీ యగాధ ప్రభావమ్ము
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

భక్తిపుష్పరాశి పద్యబద్ధముఁ జేసి
దండఁ గ్రుచ్చినంత తఱుగు నయ్య!
ఉదధివోలె నెప్పు డుప్పొంగుచునె యుండు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

దివ్యదర్శకమ్ము దిక్సూచి చేపట్టి
కడలులేనిముక్తి గతులుచూపు
నావికుఁడవునీవు కైవల్యమూర్తివి
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ఒకఁడు శూలపాణి, ఒకఁడు చక్రధరుండు,
భువనరక్షసేయఁ బూనుప్రభులు
అఖిల జగతిఁ బ్రోవ నభయహస్తుఁడ వీవు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

విరిసి నైజదీప్త లోరసి తావులు గుప్పి
ముడుచుకొన్న తమ్మిమొగ్గవోలె
విశ్రమించు నీదువిభవమ్ము భాసించు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

వేద శాస్త్రపార; వేదాంత సంచార!
వాదభేదహీన! వాఙ్నిధాన!
విశ్వచరిత! నాదబిందు కళాతీత!
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ప్రకృతి నైజమద్ది ప్రాగ్దిశ భానూద
యమును, పశ్చిమాశ నస్తమయము
కలుగుచుంట నెల్ల కాలమ్ములందును
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ.

దిశలు మార్చి గతులు త్రిప్పుదో! ఉభయ సం
ధ్యలను అరుణగిరి పథాలనుండి
జ్ఞానసూర్యునట్లు చనుదెంతు సర్వేశ?
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

పంచముద్రలందు భాసిల్లువెలుఁగును,
మించినిండి యవల మెలఁగు వెలుఁగు
వెలుఁగులెల్లదాఁటి వెలయు శాంతివి నీవె
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

కంటిలోనిపాప గాటమ్ముగాఁజూడ
హృదయకుహరమందు వెదకిచూడ
స్వాత్మరూపివీవె సాక్షాత్కరింతువు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

తారకమ్మునిచ్చి, దానఁ ద్రివేణి మా
ర్గమ్ముఁదీర్చి, తత్త్వగతినిజూపు
గురులుగొల్చు పరమ గురుదైవతమువీవు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

హృదయకమలపీఠిఁ గుమరుగా మమునిల్పి
ఈశ్వరేశ్వరుని చిదీశు నిన్ను
నెఱుకసేయుగురుని పరమగురుఁడవీవు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

పాలకడలిపైని పవళించు శ్రీమహా
విష్ణులీల విశ్వ విభుత మెఱయు
ప్రత్యుషస్సులందు ప్రభుడవుశయనింప
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

అపుడు ప్రకృతిఁ గూడి యర్ధనారీశ్వర
స్వామివైతి; విపుడు ప్రకృతివీడి
కడిఁది తపసి; నైష్ఠిక బ్రహ్మచారివి;
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ఒకట నీశ్వరుండ, వొకటఁ గుమారుండ
వుభయమూర్తి వగుచు నొప్పుచుందు
తండ్రిబిడ్డలనెడి ద్వైతభావములేక
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

తల్లిపాలు గుడువనొల్లని బుడుతవు
తావకీన దివ్యతత్త్వ సుధలు
త్రావఁ జేతుమాకు తలిదండ్రు లీవయై
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ముద్రలన్ని వినయ ముద్రాంకితమ్ములై
మోకరిల్లి శిరసు మోడ్చి నిన్ను
చేరి శరణు చేయు చిన్ముద్రమూర్తివి
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

కేవలేశ్వరుఁడవు గిరి పాదమున నిల్చి
శివుడు మేరు శైల శిఖరిపైని
అవతరించుచున్న యందమ్ము దీపించు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

హరిహరాత్మకమ్ము అద్వైతరూపమ్ము
తెలియఁజేయ భువిని వెలసినావొ?
శివునిక్షేత్రమందు శ్రీరమణుండవై,
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

పాఠములను వ్రాయు పసిబాలు పోలిక
కాళ్ళు చాఁచిపెట్టి కలముపట్టి
వ్రాతువేమి? విశ్వ పాఠమ్ములిత్తువో
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

ముక్తిఋషివి నీవు ముక్తిపావము నీది
ముక్తిగిరియు నీది ముక్తి నీవు
ముక్తిసుధలువోప ముక్తేశ్వరుఁడవయి
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

బిడ్డ ముద్దుపల్కు ప్రేమ నానందించు
తండ్రి వోలె నెట్టి వానినైన
పెద్దకావ్యమట్లు ప్రియమార చేకొందు
సచ్చిదాత్మకిరణ! జ్ఞానరమణ!

జ్ఞానరమణు సచ్చిదానందకారణు
చరణములకు మ్రొక్కి శరణుఁ జేసి
దేవదేవు కాత్మ 'నైవేద్య'మియ్యది
అంజలించి హృదయ మర్ఘ్యమిచ్చి.

శ్రీ రమణార్పణమస్తు.